# గెలుపొందిన పావురం

విజయలక్ష్మి పబ్లికేషన్స్ ప్రచురణ నెం. **20**

ప్రథమ ముద్రణ : 2001

వెల : రూ॥ 20-00

ముద్రణ :

విష్ణు గ్రాఫిక్స్, సిరిసిల్ల.
ఫోన్ : 32414.

ప్రతులకు :

**★ రేగులపాటి కిషన్‌రావు**
జి.ప. సెకండరీ పాఠశాల, ఇల్లంతకుంట.
జిల్లా : కరీంనగర్ - ఆం.ప్ర.
505402

**★ కవితా ఆనందరావు**
కవితా నిలయం
ఇంటి నెం. 10-1-436,
సంతోష్‌నగర్, కరీంనగర్ (ఆం.ప్ర.)
ఫోన్ : 55912

# ప్రగతి సూచిక

# నా మాట

మనిషి నిరంతరం ఏదో నవ్యతను సృష్టించాలని ఆలోచన సాగిస్తాడు. గతములో లేని అభివృద్ధిని సాధించాలని ఆరాటపడుతూ శక్త్యానుసారంగా కృషిని కొనసాగిస్తాడు. అసలైన కవి రసరమ్యంగా ఆలోచించి మనోహరమైన కవితలను ప్రకటించి చైతన్య వంతులైన పఠితలకు నూతన ఆలోచనా ధోరణులను అందిస్తాడు.

మాటైనా పాటైనా గేయమైనా పద్యమైనా ఎలాంటి భావం ప్రకటించడానికైనా పదముల ప్రయోగాన్ని బట్టి ఆ పదములు పలికే తీరును బట్టి ఆ పదములు పదుగురిలో పరిగెత్తే తీరును బట్టి రచయిత ప్రకటించిన భావం ప్రచారం పొందుతూ ఉంటుంది.

అలనాడు పద్యకావ్యములు ఆవిష్కరింపబడి పండిత మండలి మెప్పును పొంది పండిత పఠితల వరకే పరిమితమయ్యేవి. మాన్యులకే కాని సామాన్యులకు అవి అందుబాటులో ఉండేవి కావు అర్థమయ్యేవి కావు.

విద్యా పరిమళాల వ్యాప్తి పెరిగిన తర్వాత పద్యాలు పాఠ్యపుస్తకాలలో ప్రవేశించి ప్రచారం పొందడంతో పాటు ప్రతిభావంతులైన పఠితల మెప్పునూ కూడా పొందుతూ వస్తున్నాయి.

జానపద గీతాలు, లలిత గీతాలు, చలనచిత్ర గీతాలు,.... పాటలు..... వింగడింపు మాట ఎలా ఉన్నా భావం యొక్క ప్రాధాన్యమును బట్టి గాయకుల స్వర మాధుర్యమును బట్టి పాటలు ప్రచారం పొందుతూ ఉంటాయి. శ్రోతల హృదయాలను రంజింపజేస్తూ ఉంటాయి.

గాన సౌలభ్యం ఉన్న గేయ ప్రక్రియ ప్రచార సాధనములతో విస్తారంగా ప్రచారం పొందుతూ శ్రోతలను అలరిస్తున్నది.

కవితా ప్రక్రియల్లో వచన కవితా ప్రక్రియకు ఈనాడు అమితంగా ప్రాధాన్యం హెచ్చింది. అతి తక్కువ నియమాలతో వచన కవితల్లో చక్కన్ని భావాన్ని రసవత్తరంగా ప్రకటించే అవకాశం ఉండడం దీనికి కారణం కావచ్చు.

ఈ ప్రక్రియలో రచయిత తన భావాలను స్వేచ్ఛగా ప్రకటించవచ్చు. స్పష్టంగా ప్రకటించవచ్చు. సరళసుందరంగా ప్రకటించవచ్చు. భావ గంభీరంగా ప్రకటించవచ్చు. మర్మ గర్భంగా ప్రకటించవచ్చు.

అతి తక్కువ మంది పాఠకులకు అర్థమయ్యే విధంగా ఈనాడు వచన కవితలు వస్తున్నాయనే విమర్శ వినవస్తున్నది.

ఎక్కువ పత్రికలు వచన కవితలనే ఆదరించి ప్రచురిస్తున్నవి. ఎంతో మంది కవులు వచన కవితా ప్రక్రియను చేపట్టి తమ భావాలను ప్రతిభావంతంగా ప్రకటిస్తూ ఉండడం మనం గమనిస్తూనే ఉన్నాం.

ఈ మధ్య కాలంలో ఉత్సాహంతో అప్పుడప్పుడు రాసిన వచన కవితలను 'గెలుపొందిన పావురం' శీర్షికతో ప్రకటించి ప్రచురించి మీ ముందుంచుతున్నాను.

ఈ పుస్తకమును పఠించి అమూల్యమైన మీ అభిప్రాయాలను అక్షరీకరించి అందిస్తారని ఆశిస్తున్నాను.

ఇల్లంతకుంట
08-06-2001.

మీ

**రేగులపాటి కిషన్‌రావు**

# ప్రముఖుల ప్రశంసలు

'మీరు 'నవల'ను పంపించారు నా అభిప్రాయార్థం .... మీ పీఠిక కంటబడింది ఎత్తుగడ ఎంతో బాగుంది. పోను పోను శైలీ అభిప్రాయ సరళీ పదునెక్కినవి. (ఆమె వితంతువు కాదు) **డా॥ సి. నారాయణ రెడ్డి** 21-01-1976.

"మీ హేతువాదం ప్రశంసనీయం"

**ఇల్లిందల సరస్వతీ దేవి** 15-12-1976

" మీ నవల చదివాను ..... "ఇవన్నీ చదివితే చచ్చిపోమా ?"
మీ విజ్ఞాన సింధువులోని ఒక బిందువు మాత్రమే. అలాంటి బిందువులు ఇంకెన్నిటినో తీరాన కూచున్న మా బోటి పాఠకులకు అందించాలని కాంక్షించే....."

**నలిమెల భాస్కర్** 12-7-1977

మీ పీఠిక (ఇవన్నీ చదివితే చచ్చిపోమా?) నవల (ఆమె వితంతువు కాదు) ఆసాంతము చదివాను.... మీ పీఠిక ఒక అమృతపు గుళిక".

**వేముల సత్యనారాయణ** 17-07-1977

"మీ విషసర్పం చదివాను. పుస్తకము మొత్తంగా నాస్తిక దృక్పథంతో ఉంది.

**రంగనాయకమ్మ** 17-10-1978

"ఆకాశం అంత ఎత్తు ఎదగడానికి పూనుకున్న శ్రీ రేగులపాటి కిషన్‌రావు గారికి నా అభినందనలు (సంఘర్షణ)

**జ్వాలాముఖి** 08-07-1981

"శ్రీరేగులపాటి కిషన్‌రావు గారు సహజ కావ్య కళా ధురీణులు పరిశీలన, సదసద్వివేచన కవితాత్మక భాషణ మూడు వారి వచో వైఖరిలో క్షణకాలంలో ప్రదీప్త మానమవుతాయి".

**పాతూరి రఘురామయ్య**

"మీ రచనలు నేను కొన్ని చదివాను. హేతువాద జిజ్ఞాస గల మీ ప్రతిభకు మీ సాహిత్య ప్రస్థానమే నిదర్శనం".

**చైతన్య ప్రకాశ్** 6-8-1989

"స్రవంతి మే 1996లో మీ 'సజీవ సత్యాలు' కవితను చూసాను బాగుంది సార్"

**పత్తిపాక మోహన్** 28-06-1996.

"సామ్యవాద ఆదర్శ భావాలను అభిమానించే కవి రేగులపాటి కిషన్‌రావు గారు".

(కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర)

**డా॥ మలయశ్రీ**

"సజీవ సత్యాలు" ఆమూలాగ్రం చదివాను. ఒక మనిషి సంపూర్ణమైన వ్యక్తిగా విరాజిల్లాలంటే మేధస్సు - హృదయం ఈ రెండు శరీరంలో ఉండాలి. ఈ రెండింటికి పదును పెట్టేది. పరివర్తన కలిగించేది సాహిత్యం. అలాంటి సాహిత్యాన్ని మీరు ప్రతి రెండు పాదాల్లో తృటిల్లతలాంటి భావాన్ని సజీవ సత్యాలుగా ప్రకటించారు..... అల్పాక్షరాలలో అనల్ప భావనను పొందు పరచిన మీకు అభినందనలు".

**డా॥ వి. వీరాచారి** 21-1-1998

"సజీవ సత్యాలు" పుస్తకం ద్వారా రచయిత కొన్ని మంచి మాటలు చెప్పారు. ఇందులో ప్రతి రెండేసి వాక్యాలు ఒక ప్రబోధం".

(ఆగష్టు 1998 'వనితా జ్యోతి'లో పుస్తక సమీక్ష)

**రసూనా** (రసరాజు)

"ఇటీవల 'స్రవంతి' సాహితీ సంచికల్లో మీరు రాస్తున్న 'సజీవ సత్యాలు' చదువుతున్నాను. గజల్లలోని గంభీరతను గర్భీకరించుకొన్న కవితా ఖండికలు సజీవ సత్యాలు తెలుగు వారి దోసిళ్ళకు మీరు అందిస్తున్న ముత్యాలు."

**శ్యాంప్రసాద్** 5-11-1998

"మూగబోయిన ప్రేమ" కథ చాలా బాగుంది విషాదాంతం కావడం బాధను కలిగించింది. రచయిత రేగులపాటికిషన్‌రావు గారికి అభినందనలు."

(అగష్టు 2000 అంజలి మాసపత్రిక)

**ఆచార్య ఎస్.కె.**

"మీ సజీవ సత్యాలు త్రిశతి సరళమైన ఛందస్సులో సుబోధకంగా, సహృదయ రంజకంగా ఉంది. ఉన్నతమైన సత్యాలు ఉదారమైన భావాలు ఇందులో ఉజ్జ్వలంగా దీపిస్తున్నాయి. పండిత పామరుల్ని అలరించగల్గే అందమైన సుభాషితాలు. అభ్యుదయ స్ఫోరకంగా ఆధునికంగా, అందరి హృదయాల్ని ఆకట్టుకోగలవు. ప్రతి గ్రంథాలయంలో ప్రతి విద్యాలయంలో ఉండదగినది"

**మాల్యశ్రీ చింతూరి** 24-7-1998.

"సాహితీ క్షేత్రంలో తనకు తానుగా ఎదుగుతున్న రేగులపాటి కిషన్‌రావు సాహితీ సేవలను కథా సంకలనాలను, నవలలను, కవితలను పరిచయం చేసే నేపథ్యంలోనే నేటి కళా వైభవం".

(తేది 18-1-2000 "వార్త" కాకతీయ కళావైభవం శీర్షికలో పరిచయ వ్యాసం.)

**ఎల్. జగదీశ్వర్**

"బాలలకు నైతిక విలువల పట్ల ఆసక్తి కలిగించడానికి ఆచరణలో నైతిక విలువలు పాటించడానికి తగిన ప్రేరణను కలిగించే ధ్యేయంతో ఎన్నో గీతాలను రాశారు రేగులపాటి కిషన్‌రావు గారు.......

"సతత హరిత వృక్షమువలె
సత్యము శోభిల్లుచుండు
అసత్యాలు రాలిపడిన
ఆకులవలె కుళ్ళుచుండు"

అన్న సత్యాలను ఎన్నో బాలలకు చాటి చెప్పిన కిషన్‌రావు గారి రచనలు బాలలకు అవశ్య పఠనీయాలు."

('వార్త' 16-06-2000 బాల సాహితీ మూర్తులు" పరిచయ వ్యాసం.)

**రెడ్డి రాఘవయ్య**

"స్వార్థపరులైన ధనవంతుల ప్రవర్తనను పట్టి ఇచ్చే చక్కటి కథ రేగులపాటి కిషన్ రావు రాసిన ఈతరం కథ."

ఆదివారం 'వార్త' 03-06-2001

**టి. శ్యామల**

# 1. ముందు చూపు

చూపు ప్రకృతి ప్రసాదించేవరం
కళ్లు బాగుంటే
చూపు బాగుంటుంది.
మనసు బాగుంటే
చూపు బాగుంటుంది.
చూపు బాగుంటే
కనిపించే దృశ్యాలన్నీ
మనోజ్ఞంగా ముగ్ధ మనోహరంగా
సౌందర్య చంద్రికలు చిందిస్తూ
ఆనంద తరంగాలను బంధిస్తూ
ఊరిస్తూ ఉప్పొంగి పోయేలా
హృదయ లయలు కలిగిస్తూ
ఉన్నతిని సాధించాలనే
తపన కలిగిస్తూ ఉంటాయి.
నింగీ నేలా నిప్పూ నీరూ
కంటికి కనిపిస్తాయి.
కనిపించని గాలి కూడా
కనిపిస్తూనే ఉంటుంది.
చర్మ జనిత చైతన్య నిశిత నేత్రానికి
చూపు ఉన్న వారికి
విచక్షణా జ్ఞాననేత్రం ఉన్నవాడికి
లోకంలో అనునిత్యం జరుగుచుండే

మంచేమిటో చెడుగేమిటో
చూచీ చూడగానే తెలుస్తుంది.
కంటితో దృశ్యం చూడవచ్చు
చెవితో శబ్దం చూడవచ్చు
నాలుకతోరుచి చూడవచ్చు
చర్మముతో స్పర్శ చూడవచ్చు
ముక్కుతో వాసన చూడవచ్చు.
మనస్సుతో అన్నీ చూడవచ్చు.
మనస్సు లేక పోతే
మనస్సు బాగా లేకపోతే
కళ్లున్నా చూడలేము
చెవులున్నా వినలేము
స్పర్శానుభవం పొందలేము
వాసన గ్రహించలేము
ఏ రుచినీ అనుభవించలేము
అందుకే - అందుకే -
మనస్సుతో చూడాలి.
మంచిని మనస్సునిండా నింపుకొని చూడాలి.
వివేక నేత్రం విప్పకొని చూడాలి
జ్ఞానశక్తిని మేధస్సు నిండా నింపుకొని చూడాలి.
అప్పడే సత్యం కనిపిస్తుంది
సత్యం ఆమూలాగ్రం అవగతం అవుతుంది.
అందుకే చూపు ఒక వరం అంటున్నాను.
ముందుచూపు మానవజాతిని
మహోన్నత స్థితికి తీసుకవెళ్లే
మహత్తర శక్తి అవుతుందటున్నాను.

***

# ౨. ఎవరు నువ్వు ? ఎవరు నేను ?

ఆది శక్తిలా దివ్యశక్తిలా
దినదినము దివ్యంగా బ్రతుకుతుంటాను.
ప్రజ్వలి స్తుంటాను ప్రగతినిస్తుంటాను
లోకాల చీకట్లు చీల్చి వేస్తుంటాను.
వెలలేని వెలుగులను
దశదిశలు విసురుతూ
ప్రాణులను పోషించి
ప్రాణదాతగ సకల ప్రాణులందున నేను
మనసున్న ప్రతి ప్రాణి మనసునందున నేను
నిలిచి ఉంటాను సదా కలసి ఉంటాను.
ఈ లోకములు అన్ని నిలిచి ఉండేదాక
ఈ ప్రాణులన్నియూ బ్రతికి ఉండేదాక
చిరంజీవిలా నేను బ్రతుకుతుంటాను.
పరాశక్తిలా పరంజ్యోతిలా
పరమాత్మలా పతనమేలేని
ప్రగతిశక్తిలా నిలిచి ఉంటాను.
సకల చరాచర జగత్తుకు
నియతిని కల్పిస్తూ
నియమాలను పాటించే శక్తులకు
ప్రగతిని అందిస్తూ
సత్య నీతి ధర్మాలను పాటించే అఖండ శక్తులను
సతతం విజయబాటలో నడిపిస్తూ

ధర్మము తప్పి నడిచే దుష్ట శక్తులకు
అపజయాన్ని కలిగిస్తూ
సర్వకాల సర్వావస్తల యందు
నిలిచి ఉంటాను.
గాలినై నీరునై నిప్పునై
నేలనై నింగినై
రూపాంతరము నేను చెందుతుంటాను.
గాలినై మీ చుట్టు గంతులేస్తుంటాను.
నీరునై నేలపై సాగిపోతుంటాను.
నిప్పునై ఉదయించి కాల్చివేస్తుంటాను.
నేలనై ప్రాణులకు నిలయమై
ప్రతిక్షణం ప్రగతి పతనాలను కల్పిస్తూ
నిలిచి ఉంటాను మిమ్మల్ని నిలుపుతుంటాను.
అంతుబట్టని అవధి తెలియని
అంబరమునై నేను నిలిచి ఉంటాను.
సకల నక్షత్ర రాసులకు
గతులు కల్పిస్తూ
గమనం కల్పిస్తూ
మంచి చెడ్డలు మీకు ఎంచి చూపిస్తూ
ఉంటాను సర్వదా జీవించి ఉంటాను.
ఎవరు నువ్వు ? ఎవరు నేను ?
నువ్వు అణుశక్తివి
నేను అనంతశక్తిని.



# 3. మేలు.... కీడు

దృఢంగా ఉండే ఆ చెట్టుకు
ఆకులుంటాయి ముళ్లుంటాయి
ఆకుల ప్రక్కనే ముళ్లు పుట్టినా
ఆకుల కంటే ముళ్లే వాడిగా పొడుగ్గా పెరుగుతుంటాయి
ఆకులు పట్టుకుంటే పట్టులా మెత్తగా ఉంటాయి
ముళ్లను ముట్టుకుంటే సూదుల వలె కఠినంగా ఉంటాయి
అజాగ్రత్తగా పట్టుకుంటే రక్తం చిందేలా గుచ్చుకుంటాయి.
గాయపడిన మనిషికి
ఆకులు ఔషధంగా పనిచేసి మేలు చేస్తుంటాయి
గాయపడని మనిషికి
ముళ్లు మాత్రం గాయాలు చేసి తీవ్రంగా బాధ
కలిగిస్తుంటాయి.
ఒకే తల్లికి పుట్టినా
ఆకులు ఆత్మీయతను పంచితే
ముళ్లు గాయాలను పెంచుతాయి.
మనం ఆకులను ఆదర్శంగా తీసుకుందాం
పరుల ఆనందం కోసం
మెత్తదనాన్ని మెచ్చేతనాన్ని
మమతాను రాగాలతో సహకారం పంచిపెడుదాం
కాఠిన్యం, కరుకుదనం, కసాయితనం పెంచుకోవద్దు
చెంత చేరిన వారికి
చెఱపు ఎప్పుడూ చేయవద్దు
అదే మన జీవితంలో
మనం నేర్చుకోవలసింది
కవితలలో పంచవలసింది.

# 4. పెళ్లి ప్రయత్నం మానుకో

నాన్నా!
నన్నెందుకు కన్నావు నాన్నా!
నన్ను కని, పెంచి, విద్య నేర్పి వివేకం నేర్పి
ఇంతదాణ్ని చేశావు
ఇప్పుడు నా పెళ్లి కోసం
నువ్విన్ని బాధలు పడుతూ ఉంటే
చూచి భరించలేక ఇలా అంటున్నాను నాన్నా!
నిజానికి నీతో ఇలా అనడం కూడా సమంజసం కాదేమో నాన్నా!
ఎందుకంటే ...
అమ్మను, నా కన్న తల్లిని
నవ్వు అర్ధాంగిగా చూశావు.
నీ శరీరంలో అర్ధభాగంగా చూశావు.
అమ్మను అభిమానించావు, ప్రేమించావు గౌరవించావు
అమ్మకు ఎలాంటి కష్టాలు కలుగకుండా జాగ్రత్త పడుతూనే ఉన్నావు
నీలాంటి భర్త దొరికినందుకు
నా తల్లి గర్విస్తోంది నాన్నా!
నువ్వు నా తండ్రివని చెప్పకోవడానికి
నేనెప్పడూ గర్వపడుతూనే ఉన్నాను నాన్నా!

కానీ ...
నా పెళ్లి చేయడానికి
నువ్వు పడుతున్న పాట్లు చూచి
భరించలేక పోతున్నాను నాన్నా!
పెళ్లికొడుకు వాళ్లు
పెళ్లికూతురు తలిదండ్రులను
ఎంత చులకనగా చూస్తారో
ఈ మధ్య నాకు బాగానే తెలిసిపోయింది నాన్నా!
ఆత్మాభిమానం గొప్పదని చెప్పే నువ్వు
నాకోసం నా పెళ్లికోసం
ఆత్మాభిమానం పోగొట్టుకొంటుంటే
నా మనస్సు చలించి పోతుంది నాన్నా !
వరకట్నం పేరిట లాంఛనాల పేరిట
నువ్వు మొదటి నుండి సంపాదించిన
ఆస్తినంతా కాజెయ్యాలని చూస్తున్న
పెళ్లికొడుకు వాళ్ల ధనదాహాన్ని, దౌష్ట్యాన్ని
క్షమించలేకపోతున్నాను.
వాళ్లతో వాదించి మాట్లాడాలనిపిస్తోంది
ఎదురు తిరిగి మాట్లాడాలనిపిస్తోంది.
నేను సుఖపడాలన్న ఆరాటంతో
చదువుకున్న వరుణ్ని, ఆస్తి ఉన్న నరుణ్ని
చూస్తున్నావు కదా నాన్నా !
చదువుకున్న వాళ్లందరూ
సంస్కారవంతులు అవుతారా నాన్నా ?
సుఖపడడానికి ఆస్తి ఉండడం అవసరమే కానీ
ఆస్తి ఉన్న ఆలుమగలందరూ సుఖపడుతున్నారా నాన్నా !
సంసారంలో సుఖపడాలంటే

భార్యా భర్తలిద్దరూ సంస్కారవంతులై
పరస్పరం గౌరవించుకొని ప్రేమించుకునే
గుణం ఉండడం ముఖ్యం కదా నాన్నా!
నా పెళ్లి కోసం నా సుఖం కోసం
పెళ్లి కొడుకు వాళ్లు అడిగినంత వరకట్నం ఇవ్వడం కోసం
అప్పుచేయడం కోసం
అయిన వాళ్లను కానివాళ్లను బ్రతిమిలాడుతూ
వాళ్లు అనే మాటలు
నీ అభిమానాన్ని గాయపరుస్తూ ఉంటే
సహిస్తున్నావు కదా నాన్నా!
వద్దు నాన్నా! వద్దు.
నా కోసం మితిమీరిన త్యాగం చేయవద్దు.
నువ్వు మౌనంగా భరిస్తున్న బాధలను
గమనిస్తూనే ఉన్నాను నాన్నా!
అందుకే భరించలేక ఇలా మాట్లాడుతున్నాను.
స్త్రీకి పురుషుడు ఎంత అవసరమో
పురుషునికి స్త్రీ అంతే అవసరమని భావించి గౌరవించే
పురుషుడు తారసపడే వరకు
నా పెళ్లి ప్రయత్నం మానుకో నాన్నా!



# 5. దీన భిక్షువు

దీనుడతడు హీనుడతడు
అమాయకుడు అభాగ్యుండు
గూడులేదు తోడులేదు
కడుపుకింత కూడు లేదు
చినుగు బట్ట కట్టియుండె
చిప్ప పట్టి అడుగుచుండె
కూడు కొరకు తిరుగుచుండె
నీడకొరకు నిలుచుచుండె
క్రింద నేల కాలు చుండె
నెత్తి మీద మాడుచుండె
వీధి వీధి తిరిగి తిరిగి
పాడి పాడి అలసి పోయె

జబ్బు పడిన ఆభిక్షువు
నడవలేక నడుచుచుండె
నడచి నడచి అలసిపోయె
చెమట ధార కారుచుండె
కళ్లు బైర్లు కమ్ముచుండె
నాల్క పిడుచ కట్టుచుండె
పాడి పాడి దీన స్వరము
పాడలేక ఆగిపోయె
ఊరు చివర చెట్టు క్రింద
రాయిమీద కూరుచుండె.
ఆకలితో వేగలేక
కూడు అతడు కుడువబోయె.
అంతలోనె కావుమంటు
కాకి చెంత చేరవచ్చె
ముష్టివాని చేతిలోని
చిప్ప తన్ని ఎగిరిపోయె
చేవలేని భిక్షగాని
చేతి చిప్ప నేలరాలె
పొంచి ఉన్న గజ్జికుక్క
గంతువేసి చెంతచేరె
చెదరిపడిన ముష్టికూడు
కుక్క గతికి పరుగు తీసె.



# 6. మండుతున్న అడవి

ఆ ప్రాంతం అడవిలా ఉంది
మండుతున్న అడవిలా ఉంది
అక్కడ ...
పూలు పండ్లతో నిండియున్న
పచ్చని చెట్లతో పాటు
ముళ్లకంపలు రాల్చే
మొండి వృక్షాలు కూడా ఉన్నాయి.
సింహాలు పులులు తోడేళ్లు
మొదలగు క్రూర జంతువులతో పాటు
కుందేళ్ళు తాబేల్లు జింకలు జిరాఫీలు
మొదలగు సాదుజంతువులు కూడా ఉన్నాయి.
చిలుకలు, నెమళ్లు, పావురాలతో పాటు
కాకులు డేగలు రాబందులు కూడా ఉన్నాయి.
మట్టిలో దొర్లిపోయే వానపాములతో పాటు
కాటు వేసే కాలనాగులు కూడా ఉన్నాయి.
అయినా మండుతున్న ఆ అడవిలో
బ్రతికేదెవ్వరు ? చచ్చేదెవ్వరు ?
ముళ్లకంపలు కూలిపోతే బాధలేదు
కానీ .....
ప్రయోజన కారకాలైన మహావృక్షాలు
మాడిపోతే బాధే కదా!
క్రూరజంతువులు కాలిపోతే బాధలేదు

కానీ ...
పాలిచ్చే జంతువులు మంటల్లో చిక్కి మరణిస్తే బాధేకదా!
పీక్కతినే రాబందులు రాలిపోతే బాధలేదు
కానీ ......
ప్రకృతి అందాలు పెంచే
పక్షులు ప్రాణాలు కోల్పోతే బాధేకదా!
కాటేసే కాలనాగులు
కార్చిచ్చులో కాలిపోతే బాధలేదు
కానీ...
నేలసారం పెంచే వానపాములు
మంటల్లో చిక్కి మసిగా మారితే బాధే కదా!
అందుకే... అందుకే ... అందుకే...
మంటలు చప్పున చల్లారి పోవాలి
ఎలా చల్లారుతాయి ఈ మంటలు?
కన్నీరుతో ఆ మంటలు చల్లారుతాయా ?
కడవలతో నీళ్లు మోసి ఆ మంటలను చల్లార్పగలమా?
కన్నీరు కార్చినా, కడవలతో నీళ్లు మోసి చల్లార్చినా
మంటలు చల్లారినట్టే చల్లారి
తిరగబడి రాజుకొని
తిరిగి తిరిగి మండుతున్న
ఈ తిరుగుబాటు మంటలను చల్లార్పడమెలా ?
అమాయక ప్రాణుల మనములలో పుట్టి పెరిగే
"భయం .... భయం" అనే ప్రకంపనాలను
ఆపివేయడమెలా ?
చల్లారకుండా అంతకంతకు
వ్యాపిస్తున్న ఈ మంటలను
ఆర్పాలంటే ఒక్కటే మార్గం
అడవి అంతటా వర్షం కురిపించాలి

"సమతా వర్షం" కురిపించాలి

అప్పుడే మంటలు చల్లారుతాయి

కానీ ...

అలా వర్షం కురిపించాలంటే

మేఘాలను సమీకరించాలి

నీటిని రాల్చడానికి  వాటిని ఒప్పించాలి

ఒప్పకోకపోతే

వాటిని బంధించాలి

నీటిని కక్కించాలి

మేఘాలను సమీకరించి వాటి చేత వర్షం కురిపించడం

ఎవరికి సాధ్యం ?

ప్రభంజనునికి సాధ్యం ప్రభాకరునికి  సాధ్యం

ఆదిశక్తికి అన్నీ సాధ్యమే

ప్రజలే ఆదిశక్తిగా మారిపోతే

సమాజంలో చెలరేగే

సంఘర్షణ జ్వాలలు

అమాంతంగా చల్లారిపోవా ?



# 7. నిరంతరం వెలుగు

వెలుగు ...

జ్యోతిలా వెలుగు

చికాకును కలిగించే

చీకట్లను తొలగిస్తూ వెలుగు

కనిపించేలాగా

మనోల్లాసం కలిగించేలాగా

నీ వెలుగులు పంచుతూ వెలుగు

అంతే కానీ...

చీకటిని అంతం చేస్తానని పగబూని పంతం పట్టి

దావానంలా ఎగసిపోకు

చీకటితో లాభపడేవాళ్లూ
నీ మంటలకు మాడిపోతామేమోనని
భయపడేవాళ్లూ
నిన్ను ఆర్పివేయాలని చూస్తారు
మండుతున్న నిన్ను చూచి
చుట్టుముట్టి మట్టు పెట్టాలని చూస్తారు
నీ ఆశయం ఎంత గొప్పదైనా
నీ మనసెంత బలమైనదైనా
మంటలా మాత్రం మారిపోకు
మంటలా మారిపోతే
మండి మండి మారిపోతావు ఆరిపోతావు
అందుకే అంటున్నాను
నీ ఉనికికి భంగం కలుగకుండా
జ్యోతిలా వెలుగు
నిరంతరం వెలుగు
మంటలా మండకు
అర్థాంతరంగా ఆరిపోకు
నా హితబోధను పాటించు
చిర కాలం జీవించు నీ లక్ష్యం సాధించు.

☆☆☆

# 8. సృజనశక్తి

సృజన శక్తిని నేను
మానవ సమాజానికి
ప్రగతిని పండించి ఇచ్చే
ప్రథమ శక్తిని నేను సృజన శక్తిని నేను
కర్షకుని ఆలోచనా స్రవంతిలో ప్రవహించి
ఆహారోత్పత్తికి అధికోత్పత్తికి తోడ్పడుతుంటాను
కార్మికుని ఆలోచనల్లో ఆవిర్భవించి
నాణ్యమైన వస్తూత్పత్తికి సర్వదా తోడ్పడుతుంటాను
సకల గృహాల ఆకృతులకు
ఆధారం నేను.
సకల కళల ఆవిర్భావానికి
ఆధారం నేను.
సర్వ జనుల ఆనందానికి
ఆధారం నేను.
నేనే నేనే సృజన శక్తిని నేనే.

***

# 8. సృజనశక్తి

సృజన శక్తిని నేను
మానవ సమాజానికి
ప్రగతిని పండించి ఇచ్చే
ప్రథమ శక్తిని నేను సృజన శక్తిని నేను
కర్షకుని ఆలోచనా స్రవంతిలో ప్రవహించి
ఆహారోత్పత్తికి అధికోత్పత్తికి తోడ్పడుతుంటాను
కార్మికుని ఆలోచనల్లో ఆవిర్భవించి
నాణ్యమైన వస్తూత్పత్తికి సర్వదా తోడ్పడుతుంటాను
సకల గృహాల ఆకృతులకు
ఆధారం నేను.
సకల కళల ఆవిర్భావానికి
ఆధారం నేను.
సర్వ జనుల ఆనందానికి
ఆధారం నేను.
నేనే నేనే సృజన శక్తిని నేనే.

***

పక్కవాడిని పాముసోటిలో పడగొట్టి
పరుగెత్తి నిచ్చెనను పట్టుకోకు
నువ్వు పతనానికి ప్రమాదానికి
గురికాకుండా తప్పించుకోవడంలో తప్పులేదు
కానీ...
పక్కవాడికి హాని చేయడంలో తప్పున్నది
నువ్వు ప్రగతిని ప్రమోదాన్ని
అందుకోవడంలో తప్పులేదు.
కానీ...
పక్కవాడిని పైకి రాకుండా అడ్డుకోవడంలో
పడగొట్టడానికి ప్రయత్నం చేయడంలో తప్పున్నది
తప్పుచేసే వాళ్లు పతనానికి గురికాకతప్పదు
అందుకే జీవిత వైకుంఠపాళిలో
నిజం అవసరం నిజాయితీ అవసరం అంటాను.
నిజం నిజాయితీ ఉన్నవాళ్లే
జీవిత వైకుంఠపాళిలో
నిచ్చెనలెక్కాలని ఎక్కుతారని
అవిలేనివాళ్లు
ఏ పాము నోటిలోనో చిక్కి
మళ్లీ బయటపడకుండా
పతనం చెందుతారని చెందాలని
ఆశిస్తున్నాను శపిస్తున్నాను.

***

# 10. గెలుపొందిన పావురం

ఎగిరే పావురాన్ని చూచి
కళ్లు మండిన డేగ
దాన్ని కబళించే ఉద్దేశముతో
కసిగా ఎగిరింది
వెంబడించింది
ప్రాణ భయంతో పరుగులు తీస్తూ
తన ప్రాణం తీయొద్దని
దీనంగా అంది పావురం
డేగ పావురం మాటలను
పట్టించుకోలేదు
దాన్ని పట్టుకోవాలనే
పట్టుదలతో ఉంది
పావురం భయపడుతూనే
పరుగెత్త సాగింది.
పరుగెత్తుతూనే బ్రతిమిలాడ సాగింది.
పావురం మాటలను లక్ష్యపెట్టని డేగ
దానిని అలాగే వెంబడించసాగింది
పావురం ధైర్యం తెచ్చుకొంది
బుద్ధిబలంతో యోచించింది

మామూలు శక్తి చాలనప్పుడు
యుక్తిశక్తితో శత్రువును జయించడం సమంజసమని భావించింది
పరుగెత్తుతున్న పావురానికి
కొండ శిఖరంపై పడియున్న
కత్తిలాంటి కర్ర ముక్క కనిపించింది
అది రివ్వున కర్రకత్తి వద్దకు పరుతెత్తివచ్చి
కాళ్లకరాలతో పట్టి ఎత్తింది
వెనువెంటనే గురిచూచి డేగ రెక్కవైపు విసిరికొట్టింది
హింసించే డేగ రెక్క ముక్కలా విరిగింది
పతనమైన ఆ రెక్క నేలపైన ఒరిగింది.
దుష్టుండగు తులువ డేగ
పైకి ఎగరబోయింది
ఎగురలేక ఎగురలేక
చతికిలబడి పోయింది.
రక్తం ధార లాగ కారి కారి
కళేబరము కూలింది.
దుష్టబలం కలిగియున్న
డేగకన్ను మూసింది
డేగ చావడం అంటే
దుర్మార్గం చావడం
పావురం జయించడం అంటే
శాంతం విజయం సాధించడం.



# 11. ఎవరు నువ్వు ?

ఎవరు నువ్వు ?
మనిషిలా కనిపిస్తున్నావు
రాక్షసునిలా ప్రవర్తిస్తున్నావు
నీచూపులో కారుణ్యం లేదు
కసి ఉంది కాఠిన్యము ఉంది
నీ మాటల్లో మమత లేదు మాధుర్యం లేదు
ఉంది అహంకారం, అదికాదు అలంకారం
నువ్వు దురాలోచనా పరుండవు
దీనుల హింసించే దానవుండవు
కుయుక్తులతో పరుల కొంపలు కూల్చే అధముండవు
నీ ఆటలు ఇక సాగవు
మాలాగే మనిషిలాగే ఆలోచించాలి నువ్వు
నీ చూపులో కారుణ్యం ఉదయించాలి .
మాకు నచ్చేలా మేము మెచ్చేలా మాట్లాడాలి నువ్వు
నీ చేతుల్లో ఉన్న బాకులను బందూకులను
పక్కకు పడేసి
పనిముట్లు పట్టుకొని పనిచెయ్యాలి మాలాగే.
పని చెయ్యకుండా
బాకులు బందూకులు వదలకుండా పట్టుకొని
దౌర్జన్యంతో దోపిడీలు చేస్తూ
బ్రతుకుదామనుకుంటే
ఆ బాకులే బందూకులే నిన్ను బలిపెట్టుతాయి.
మేము శాంతి క్రాంతిని కోరే కపోతములం
డేగలా వెంటాడకు
మేము ప్రగతి పాలు పెంచే గంగిగోవులం
పెద్ద పులిలా వేటాడకు

☆☆☆

# 12. విజయ రహస్యం

మబ్బులు తొమ్ము విరిచి అడ్డు వస్తే
సూర్యుడు తన నడక ఆపి నిలిచిపోతాడా ?
గాలి తనశక్తినంతా కూడదీసుకొని వస్తే
సూర్యుడు వెనుదిరిగి వెళ్లిపోతాడా?
ఉన్నచోటే పడి ఉండే సాగరుడు
తన కెరటాల బాహువులతో
సూర్యుణ్ని బంధించాలని చూస్తే
క్షణకాలమైనా బంధించబడుతాడా ?
ఎంతో ఎత్తుకు ఎగరగలనని గర్వపడే గద్దను చూచి
సూర్యుడు నవ్వుకోకుండా ఊరుకుంటాడా ?
తాను ఇచ్చిన వెలుగు దుస్తులు వేసుకొని
వెలిగిపోతున్న చంద్రుణ్ని చూచి
సూర్యుడు ఈర్ష్య పడుతాడా ?
మబ్బు పట్టిన వాళ్లు
గాలివాటంగా తిరిగేవాళ్లు
నీరుగారే మనసున్న వాళ్లు
మదగర్వం కలిగి ఉన్న వాళ్లు
సహజశక్తి సంపన్నులను మహాశక్తి సంపన్నులను
ఎదిరించి ఏనాడూ విజయం సాధించలేరు.
ఆరని తేజస్సు గలవాళ్లు
తమలాగే వెలిగే వాళ్లను చూచి
వెలుగుతూ ఉండుమని ఆశీర్వదిస్తారు
అదే సహజశక్తి సంపన్నుల
నిరంతర విజయ రహస్యం.

***

# 13. నీ లక్ష్యం ఏమిటి ?

కత్తి కరుణ గలిగిన వైద్యుని
కరకమలములలో కదలినప్పుడు
రోగికి చికిత్స జరుగుతుంది.
రోగం తొలగుతుంది
ఆరోగ్యం పెరుగుతుంది.
మృత్యువును తప్పించుకున్న మనిషి
వైద్యుని పట్ల ప్రేమాభిమానాలు ప్రకటిస్తాడు.
కత్తి ...
కఠిన చిత్తుని
కసాయి చేతులలో చేరినప్పుడు
అతడు తన దుర్మార్గపు లక్ష్యాన్ని
సాధించుకోవడానికి
ఆ కత్తినే వినియోగించి
కుత్తుకలు ఖండిస్తాడు
ప్రాణాలు తీసేస్తాడు.
మంచి లక్ష్యం గలవాళ్లు
కత్తిని కరుణను పెంచడానికి ఉపయోగిస్తారు.
కసాయి గుండె గలవాళ్లు
ఆ కత్తినే కరుణను చంపడానికి ఉపయోగిస్తారు.

☆☆☆

# 14. కాలం చెప్పే తీర్పు

కాలాన్ని కొలవడానికి
కాలమాన పరికరాలను రూపొందించారు
సెకండ్లు, నిమిషాలు, గంటలు
రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు
సంవత్సరాలతో కాలాన్ని కొలవడానికి వీలు కానప్పడు
కాంతి సంవత్సరాలతో కాలాన్ని కొలుస్తున్నాము.
కాలాన్ని ఎన్నో రకాలుగా కొలవవచ్చు.
రకరకాల పరికరాలతో కొలవవచ్చు
కానీ గతకాలం ఎంత ? అని ప్రశ్నిస్తే
ఎంతని చెప్పగలరు ఎవరైనా ?
అనంతం అంటుంటాం
అదే సరియైన జవాబు అనుకుంటాం
అలాగే భవిష్యత్కాలం ఎంత అని ప్రశ్నిస్తే
ఎంతని చెప్పగలరు ఎవరైనా ?
భావికి  అంతులేదు అంటుంటాం
అదే భద్రమైన భావం అనుకుంటాం
గతానికి భావికి మధ్య ఉండే

వర్తమాన కాలం ఎంత ?
కాలం అనంతం అయినప్పుడు
కాలం చేసే పనులు కూడా అనంతం
కాలమే ఈ అనంత విశ్వాన్ని నడిపిస్తుంది
సర్వగోళాలలో మార్పు తెప్పిస్తుంది
వెలుగులు పంచేది కాలమే
చీకట్లు నింపేది కాలమే
కాలమే పంచభూతాలకు
పనులు కల్పిస్తుంది
పంచభూతాల కలయికలో విచ్ఛేదనలో
ఈ అనంత విశ్వములో
అనుక్షణం పరిణామం జరుగుతూ ఉంది
కాలం పరిణామ శీలి
కాలాన్ని లెక్కించే వాళ్లు
కాలాన్ని కొలవడానికి సాధనాలు తయారించేవాళ్లు
ఎన్నెన్ని గోళాలలో ఉన్నారో ఎవరికి తెలుసు ?
మన గోళంలోనే భూగోళంలోనే
కాలాన్ని ఎన్నెన్నో విధాలుగా లెక్కించే వాళ్లు ఉన్నారు.
కాలానికి రకరకాల భాష్యాలు చెప్పే వాళ్లు కూడా
ఎందరెందరో ఉన్నారు.
కాలమే అనంత మార్పులను కలిగిస్తుంది
కాలమే ప్రాణులను కల్పిస్తుంది నడిపిస్తుంది కబళిస్తుంది
ఏ ప్రాణిని ఎప్పుడు కల్పిస్తుందో
ఎన్నిరకాల ప్రాణులను ఎప్పుడెప్పుడు కల్పిస్తుందో
కాలానికే తెలియాలి.
మంచి చేసిన వారి ఘనకీర్తిని
చెడుగు చేసిన వారి అపకీర్తిని
కాలమే ముందు తరాల వారికి వినిపిస్తుంది.

మేలు చేసే వారికి  మేలు కలుగుతుందని
కీడు చేసే వారికి కీడు కలుగుతుందని
కాలమే అలాంటి చర్యలను కల్పిస్తుందని
కాల మర్మజ్ఞులు నమ్మి చెపుతుంటారు
అందుకే సత్కార్యములు చేస్తూ
సజ్జన సమ్మతము పొందుతూ
కాలంతో పాటు కదలి పోవాలి.
కాలం చేసిన పిదప కూడా
కలకాలం జీవించేలా
కీర్తిపొందే పనులు చేస్తూ జీవించాలి
అదే కాలం చెప్పే తీర్పు

* * *

# 15. బండ హెచ్చరిక

నేను బండను
నేలతల్లి గర్భములో
తొమ్మిది లక్షల సంవత్సరాలు
లక్షణంగా పెరిగినదాణ్ని
తల్లి భూమాత
ప్రకంపనల ప్రసవ వేదనపొంది ప్రసవించగా
నేను నేలపై జీవించడానికి వచ్చాను.
తర్వాత విషయం చెప్తాను వినండి

కాళ్లు రెండింటితో నడయాడు వాడు
రెండు చేతులతోన పనిచేయువాడు
కనుగవతో సకలమ్ము వీక్షించువాడు
మనసుతో మేధతో యోచించువాడు
మనిషన్న పేరుతో మనుచున్న మొనగాడు
ననుచేరవచ్చాడు నను చూడవచ్చాడు
నను తట్టి చూశాడు నను మొట్టి చూశాడు
నా గట్టి తనమెంతో తాను కనుగొన్నాడు
నన్ను ముక్కలు చేయు విధము కనిపెట్టాడు.

నన్ను ముక్కలు చేసి ముక్క ముక్కలు చేసి
ఆ ముక్క ఈ ముక్క ముక్కపై ఒక ముక్క
వరుసగా చేర్చాడు వరుసగా పేర్చాడు
గోడ కట్టుట తాను చక్కగా నేర్చాడు.

ఇల్లు కట్టుట నేర్చినాడు మేడకట్టుట నేర్చినాడు
మెట్లు కట్టుట నేర్చినాడు మేడ ఎక్కుట నేర్చినాడు
ముక్క ముక్కలు చేసి నన్ను ముక్కలు చేసి
చిన్న ముక్కలు చేసి కంకరగ నను జేసి
రోడ్డుపై పడబోసి రోలరుతో తొక్కించి
బాట వేయుట నేర్చినాడు బాటపై బండ్లు నడుపుట నేర్చినాడు.

నన్ను ముక్కలు చేసినాడు
గుళ్లు కట్టుట నేర్చినాడు
నన్ను చెక్కుట నేర్చినాడు
బొమ్మ చేయుట నేర్చినాడు.

అందమైన మనిషిలాగ
మనిషి నన్ను మలిచినాడు
మహిమలున్న దేవుని వలె
నన్ను మనిషి కొలిచినాడు.

అసలు విషయం చెప్పనా ?
కాళ్లున్నను కదలలేను
కళ్లున్నను చూడలేను
చెవులున్నను వినగలేను
చేతులున్నను పని చేయను
నోరున్నను పలుకలేను
మనసన్నది లేనెలేదు.
యోచించను యాచించను

బాధించను సాధించను
అయిననేమి అయిననేమి
ఆలోచన గల మనుజుడు
నా మూర్తిని పూజించెను.
పసుపు కుసుమ కుంకుమలను
అలంకరించి అర్చించెను
ధూపం వేశాడు మనిషి
దీపం వెలిగించె మనిషి
మాలవేసి మనసు ఉంచి
భక్తి తోడ కొలిచె మనిషి
కోరికలను తెలుపుకుంటు
ఫలసుమాలు ఇచ్చె మనిషి.

మూగజీవుల తలలను నరికి నరికి
వాటి రక్తమ్ము తర్పణము చేసి చేసి
పనికి మాలిన వరములు కోరికోరి
తీర్చుమనుచుండు మనుజుండు వేడి వేడి.

మనిషి కోరినట్టి కోర్కె తీర్చగలిగితే
నేను బండనెలా అవుతాను ?
మనిషి కోరిన ఏ బండ కోర్కెనైనా
తీర్చజాలను తెలియుడీ మనుజులారా !
నేను ఎన్నో రకాలుగా
ఉపయోగపడుతున్నాను.
గోడగా నీడగా
మేడగా రోడ్డుగా
బ్రిడ్జిగా డ్యాముగా
ఎన్నని చెప్పను ?

ఎన్నెన్నో రకాలుగా ఉపయోగపడుతున్నాను.

అయినా

దుర్మార్గం చేసే మనిషిని

బండ మనిషి అని బండ గుండె గలవాడని

నాతో పోలుస్తారెందుకు ?

దుర్మార్గము చేసే మనిషిలా

నేను నా ప్రమేయంతో

ఎవరికీ ఎలాంటి హాని చేయనుగా

మరి దుర్మార్గులను

నాతో పోల్చడమేమిటి ?

ఇక ముందు

ఎవరైనా ఎప్పుడైనా ఎక్కడైనా

దుర్మార్గులను నాతో పోలిస్తే ఊర్కోను

అందుకే జాగ్రత్త అని హెచ్చరిస్తున్నాను.



# 16. భూస్వామ్యము

ఆ మహావృక్షం
పెద్ద భూస్వామినని తెగ గర్వపడుతోంది.
తనలాగ ఎదిగిన చెట్టు
ఆ ప్రాంతములో మరొకటి లేదని
తల ఎగరేస్తూ ఠీవిగా చెప్తోంది.
తనకున్నన్ని కొమ్మలు రెమ్మలు ఆకులు మరేచెట్టుకు లేవని
ఘనంగా గర్వంగా గంభీరంగా చెప్తోంది.
తన సమీపములో పుట్టి పెరిగే
ఏ చెట్టూ తనలాగ ఎదగలేదని
వాటికి ఆశక్తి లేకుండా చేసే శక్తి
తనకు ఎంతెంతో ఉందని
తల ఎగరేస్తూ గర్వంగా చెప్తోంది.
తనను ఆశ్రయించి జీవితాలు వెళ్లబుచ్చే
కాకులు రాబందులు కోతులు ఊసర వెల్లులు
ఎన్నెన్నో ఉన్నాయని మందహాసం చేస్తూ ఘనంగా చెప్తోంది.
నేలను ఆక్రమించి
పతనం కాని ప్రబల శక్తిని పెంచుకున్నానని
విప్లవకారునిలా మీదపడే గాలిగాడు
తనను ఏమీ చేయలేడని
తన ఆహ్వానం మీదనే
మేఘనాథుడు వస్తాడని
అందరికీ నీళ్లు అందిస్తాడని

అహంభావంతో అందంగా చెప్తోంది
కొన్ని వసంతాలు గడచిపోయాయి.
ఎంతెంతో నేలను ఆక్రమించిన
అంతెత్తు ప్రధాన వేరును
గట్టి పురుగులు మట్టు పెట్టడం ఆరంభించాయి.
ఆ చెట్టు తన మనుగడకు అవసరమైన ఆహారం
సాధించుకోలేక పోయింది.
భూమి మీద పట్టుతప్పడం ప్రారంభమయింది.
తాను బలహీనపడిపోతున్నానని
ఆ మహావృక్షం ఎట్టకేలకు గ్రహించింది.
కాళ్లల్లో చేతుల్లో నరనరాల్లో
శక్తి క్షీణించినట్టే అనిపించింది ఆ ఘనవృక్షానికి
చిన్నగాలి వీచినా పడిపోతానేమోనని
భయపడసాగింది వృక్షం.
గాలి బలంగా వీచడం ప్రారంభమైది.
ఇన్నాళ్లూ పట్టుతప్పని ఆ వృక్షం
వీచే గాలిబలంతో పట్టు తప్పి పడిపోయింది.
ఇన్నాళ్లూ ఆ మహా వృక్షాన్ని ఆశ్రయించిన పక్షులు క్షుద్రజంతువులు
వెళ్లి మరో వృక్షాన్ని ఆశ్రయించాయి.
ఆ మహావృక్షం సమీపములో పుట్టి పెరుగుతున్న
ఎన్నెన్నో చిన్ని చిన్ని చెట్లు సంతోషంతో ఊపిరి పీల్చుకున్నాయి.
ఇకముందు తమ ఎదుగుదలకు
ఆటంకం లేదని స్వేచ్ఛగా ఎదగవచ్చునని
ఆత్మ విశ్వాసంతో పచ్చని తలలూపుతూ నవ్వసాగాయి.



# 17. గడ్డితినే మనిషి

వాడు గడ్డితినే మనిషి
గడ్డె నాక్రమించి
గడ్డితినే అలవాటు పెంచుకున్న వాడికి
గడ్డి వేయడం తప్ప
మరో మార్గం లేదంటాడు సామాన్యుడు
ఈ గడ్డితినే మనిషిని
మనిషిలా అన్నంతిని పని చేయుమంటే
గుర్రుగా చూస్తాడు ఎర్రగా చూస్తాడు
గడ్డి పడవేయకుండా పని చేయుమంటే
పని చేయుమన్న వాని దిక్కైనా చూడడు.
కష్టజీవిలా ఫోజుకొడుతూ
కాగితాల మీద బరబరా గీకుతాడు
మళ్లీ మళ్లీ పలకరిస్తే
పనిచేయుమని నిలదీస్తే
రాయడం ఆపేస్తాడు
ఫైలు మూసేస్తాడు.

కాలింగ్ బెల్ నొక్కుతాడు
అటెండర్ రాగానే
అడ్డమైన వాళ్లను లోపలికి
ఎందుకు రానిస్తున్నావని అరుస్తాడు
అప్పుడు ఇంకా చేయగలిగింది ఏముంటుంది ?
గడ్డితినే మనిషిని వదిలి
ఆ గదిని వదిలి బయట పడక తప్పదు కదా !
సవ్యంగా పూర్తి కావలసిన పనికోసం
ఎంతోకాలం గడిచినా ఎన్నోసార్లు నువ్వు
ఆ గడ్డితినే మనిషి చుట్టు తిరిగినా
పని జరగకపోతే నువ్వు చేసే పని ఏమిటి ?
గడ్డితినే మనిషికి గడ్డి తినిపించి
పనిచేయించుకుంటావా ?
గడ్డితినే మనిషికి వేయి కొరడా దెబ్బలైతే
గడ్డిపడవేసిన మనిషికి పదివేల కొరడా దెబ్బలట.
నువ్వు బాగా ఆలోచించు
నీ పనిని నవ్వు సక్రమంగా చేయించుకోవడానికి
చట్టాలను ఆశ్రయించి
న్యాయస్థానాల ద్వారా న్యాయం పొందుతావా ?
లేక ...
గడ్డితినే మనిషికి గడ్డి తినిపించి
పదివేల కొరడా దెబ్బలు తింటావా ?
ఎలా పనిని సాధిస్తావో ఆలోచించి చెప్పు.

(సకాలంలో సక్రమంగా పనిచేసే అధికారులందరికీ ఈ కవిత అంకితం)



# 18. నడక

ప్రతి మనిషికి
రెండే రెండు కాళ్లుంటాయి
మనిషి నడవడానికి
ఈ కాళ్లే నిత్యం ఉపయోగపడుతుంటాయి
నడక రెండు రకాలు
మొదటిది భౌతికంగా నడవడం
రెండవది మానసికంగా ఎదుగుతూ నడవడం
పుట్టుకతో కాళ్లులేని వాళ్లు
పుట్టిన పిదప కాళ్లు విరిగిన వాళ్లు
అడుగులు వేస్తూ ముందుకు వెళ్లకపోయినా
ఆలోచిస్తూ తాము సాధించదలచిన
లక్ష్యం వైపు అడుగులు వేస్తూనే ఉంటారు.
కాళ్లున్న వాళ్లు కాళ్లులేని వాళ్లు కూడా
దూర దూర ప్రదేశాలకు వెళ్లవచ్చు.
భౌతికంగా నడుస్తూ
దూరదూర ప్రదేశాలకు వెళ్లడం గొప్ప కావచ్చు
కానీ...
మంచి లక్ష్యం సాధించడానికి
మంచి ఆలోచనతో
నడకసాగించడం గొప్పను మించిన గొప్ప
ఒకడు నడచి నడచి భూగోళాన్ని చుట్టి రావచ్చు
ఒకడు నడచి నడచి ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కి రావచ్చు

ఒకడు నిత్యం నడుస్తూ ఉన్నా
ఏ లక్ష్యాన్ని సాధించక పోవచ్చు
ఒకడు తన శక్తి యుక్తులతో
వేలమందిని తనచుట్టూ నడిపించుకోవచ్చు
ఒకడు తన వెనుక లక్షల మంది నడిచే విధంగా నడుస్తాడు.
ఒకని నడక ఆదర్శంగా ఉంటుంది.
ఒకని నడక వక్రంగా ఉంటుంది.
వక్రంగా నడిచేవాడు చెడినా, అభివృద్ధి చెందినా
అతని నడక మాత్రం ఎవరికీ ఆదర్శం కాదు
ఆదర్శం పాటిస్తూ లక్ష్యం వైపు నడక సాగించేవాడు
ఎందరికో ఆదర్శం కాగలుగుతాడు.
అతని నడక ఆరోగ్యవంతమైనది
అతని వెంట నడిచేవాళ్లు కూడా
ఆరోగ్యవంతమైన లక్ష్యాన్ని సాధించగలుగుతారు
సౌశీల్యం చక్కని నడక నేర్పుతుంది
సౌజన్యం చుక్కలా మెరిసే నడక నేర్పుతుంది
ధీ శక్తి దీక్ష అనురాగం ఆప్యాయతలు
మంచి లక్ష్యం వైపు పరుగెత్తడానికి
తగినంత శక్తిని ప్రసాదిస్తాయి.
మంచి నడక నడిచే వాళ్లే
మంచిని పెంచే లక్ష్యాన్ని సాధించగలుగుతారు.
మంచి నడక నడుస్తూ మంచిని నేర్పే వాళ్లే
స్వర్గాన్ని మించిన సమాజాన్ని నిర్మించగలుగుతారు.

# 19. మమత పండించు సమత సాధించు

కనిపిస్తూ కనువిందు చేసే
ప్రకృతిని పరిశీలించి చూడు
ప్రకృతి రహస్యాలను ఛేదించడానికి
పరిశోధన సాగించి చూడు
పలు తెరంగుల పరిశ్రమిస్తూ
పాడిపంటలు పెంపు జేస్తూ
పదార్థాలను వృద్ధి చేస్తూ
సుఖంగా జీవించు నువ్వు
చిర యశస్సును ఆర్జించు నువ్వు

పరులను పీడించకు - పగతో జీవించకు
తలపడి ఓడించకు - ఆధిక్యత ప్రకటించకు
వంచించకు బాధించకు
దూషించకు యాచించకు.

ధర్మాన్ని ధర్మముగ పాటించునువ్వు
న్యాయాన్ని నిత్యమూ గెలిపించునువ్వు
సత్యాన్ని సతతమ్ము భాషించునువ్వు.

వెలలేని విద్యలను ఆర్జించు నువ్వు
నిత్యమూ నవ్యతను సృష్టించు నువ్వు
మనిషి మనిషిని కలుపు మమతనే పండించు
సకలజన హితముకై సమతనే సాధించు.

## ౨౦. అంతిమ విజయం

నీతి...

న్యాయాన్ని ధర్మాన్ని

సహనాన్ని సహకారాన్ని

శాసనాన్ని శాంతాన్ని ఆశ్రయించి

ఆదర్శం పాటించి

అభ్యుదయం సాధించి

అందరి ఆనందానికి

ఆధారం అవుతూ ఉంటుంది.

అవినీతి...

అన్యాయాన్ని అధర్మాన్ని

నంగనాచి సహనాన్ని

అవకాశవాదపు సహకారాన్ని ఆశ్రయించి

ఆదర్శం ప్రదర్శించి

మెప్పు పొందని ప్రగతి సాధించి

అక్రమ ఆనందానికి

ఆధారం అవుతూ ఉంటుంది.

అంతేకాదు
నడుస్తున్న నీతిని
ఆటంక పరచాలని చూస్తుంది.
ఎదిరించి నిలిచే నీతిని
అంతమొందించాలని చూస్తుంది.
నీతిని జయించడం తన తరం కాదని
అవినీతికి తెలిసినప్పుడు
నీతి కాళ్లు పట్టుకొని
నీతిగానే బ్రతుకుతానని
ఆపద్ధర్మంగా ఒట్టేసి చెప్తుంది.
అయినా ....
అవినీతి అవినీతి పథంలోనే నడుస్తూ ఉంటుంది.
నీతిని వంచనా శిల్పంతో ఓడిస్తూనే ఉంటుంది.
అందుకే అవినీతి అంతం పొందాలని
మనసారా కోరుకుందాం.
అందరికీ వినిపించేలా
చైతన్యం రగిలించేలా
పసిడి పలుకులు ప్రకటిద్దాం.
అవినీతిని అంతం చేసే
పలు చర్యలు చేపడుదాం.
అంతిమ విజయం
నీతికే ప్రాప్తించాలని ఆశిద్దాం.



## 21. చతురులు

లోకాన్ని తెలుసుకొని
నాకాన్ని తెలుసుకొని
తనను తాను తెలుసుకొని
హిత భాషియై మితభాషియై
పరిమిత స్వార్థముతో
పరహిత భావంతో
సమతామమతలు పంచేవాడు రుషి.

ప్రకృతినీ పరిసరాలనూ
పరిశీలిస్తూ
ప్రకృతిలోని పదార్థాలను
ఉపయోగిస్తూ
ప్రగతినందించే పరికరాలను
తయారిస్తూ
ప్రయోగాలు పరిశోధనలు
కొనసాగిస్తూ
నిక్కమైన నిజాలు తెలుసుకొని
నిర్మోహమాటంగా
సత్యసమ్మతంగా
ప్రకటించేవాడు శాస్త్రవేత్త.

సహజ జ్ఞానానికి శాస్త్ర జ్ఞానానికి
అందని విషయాలను
చమత్కారంగా చైతన్య వంతంగా
మనస్సులను ఆకట్టుకునే విధంగా
వివరించ గలిగేవాడు తత్త్వవేత్త.

చూచింది చూచినట్టు
చూడంది చూచినట్టు
నిజాన్ని అందంగానూ
కల్పనను కమనీయంగానూ
తలలున్న వాళ్ళు
తలలూపే లాగ
తులలేని భావాలు
తలకెక్కే లాగ
కఠిన గుండెలు కరిగే లాగ
కారుణ్యం కురిసే లాగ
గతం కనులముందు నిలుచునట్లు
గతాన్ని వర్తమానాన్ని సమన్వయ పరచి
భవిష్యత్తుకు ఉపకరించే
భావాలను నీతులను
రుషిలాగ, శాస్త్రవేత్తలాగ తత్త్వ వేత్తలాగ
చెప్పి మెప్పించగలిగేవాడు కవి.



# ౨౨. నమ్మకం

నియమ నిష్ఠలెన్ని ఉన్న
దైవభక్తి ఎంత ఉన్న
భజన చేయు గుణము నీకు
మనసు నిండ నిలిచియున్న
సెలయేటిలో చన్నీటిలో
స్నానాలే చేయుచున్న
అనునిత్యం గుడికి చేరి
అర్చనలే చేయుచున్న
ధూప దీప నైవేద్యం
సమర్పించి మొక్కుతున్న
పదపదమున భక్తి నింపి
పాటలెన్ని పాడుతున్న
పూలు పండ్లు ప్రసాదాలు
ఎన్ని మార్లు పంచుతున్న
కనిపించని ఆ దేవుడు
కనిపించడు నీకెప్పుడు
పలుకలేని ఆ దేవుడు
పలుకులేవి వినిపించడు
నమ్మకం నీ నైజమైతే
నమ్ముతూనె జీవించు
నమ్మకమది లేని వాన్ని
నిజంగానె నిందించకు
నమ్మకం నీ నైజమైతే
నీతినెప్పుడు నమ్ముచుండుము
ప్రేమనైజం చూపగలిగితె
దీనులను ప్రేమించు చుండుము

# 23. మనసు ఎదిగిన నరుడు

వానరము నుండియే నరుడు వచ్చిననేమి
మనసు ఎదిగిన నరుడు హరుడు కాలేదా ?
మనిషి మనసులో పశువుగుణము చేరిననాడు
మనిషి పశువుగ మారి హీనుడవలేదా ?

చీకట్లు నీచుట్టు చుట్టు ముట్టిననేమి
వెలుగ గలిగేశక్తి ప్రభలముగ నీకుంటె
ఈర్ష్య పడు దుర్బలులు ఎందరున్నను ఏమి
చేరదీసే మంచి మనసింత నీకుంటె

మనిషిగా మనదలచు కున్నావా ?
మరక చేరిన బుద్ధి నెప్పడు మనసుతో కడిగేసుకో
మమత మదిలో నిలుప దలచావా ?
స్వార్ధ బుద్ధిని త్రుంచుకుంటూ త్యాగమే పెంచేచుకో

నాకలోక పాలకుడే నరలోకం చేరితే
నవ్య దివ్య చట్టాలతో ఈలోకం ఏలితే
ఈ లోకం నాకం లా మారకుండునా ?
మనిషి దివ్య మూర్తు లలో కలువకుండునా ?

# 24. చమత్కార చంద్రికలు

పెరుగుచుండు ప్రాణికి తొలిశ్వాస
జననం.
పతనమ్మగు ప్రాణికి తుది శ్వాస
మరణం.

వీనులకే విందు కలిగించు
గానం.
శబ్దాలనే సృష్టి కలిగించు
గాత్రం.

బట్టలకు అందాలు తెస్తుంది
కుట్టు.
ఆటలకు విజయమ్ము ఇస్తుంది
జట్టు.

మనసును మురిపిస్తాయి
అందాలు.
మనసును రగిలిస్తాయి
చందాలు.

ఉన్నత స్థానమును చేర్చేది
మెట్టు.
ఉత్తమ గుణములను పెంచేది
ఒట్టు.

